# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
సంపుటి: 58 సంచిక: 27
స్థాపితం: 1930
3-7-1987
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# వి.పి. సింగ్ రాకపై అనేక అనుమానాలు

(మా హైదరాబాదు ప్రతినిధి)

మాజీ ఆర్థిక, రక్షణశాఖల మంత్రి శ్రీ విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ హైదరాబాదు రావడంపై రాష్ట్ర కాంగ్రెసులో అయోమయ వాతావరణం నెలకొన్నది. ఇక్కడ నివసిత రాజస్తానీ పట్టభద్రుల సంఘం ఏర్పాటుచేసిన ఒక కార్యక్రమంలో పాల్గొనడానికి ఆయన హైదరాబాదు వస్తున్నారు. అయితే శ్రీ సింగ్ హైదరాబాదు ఆగమనం కేవలం ఇందు కోసమేనా? కేంద్ర రాష్ట్రపతి ఎన్నికలకు ముందుగా కాంగ్రెసు వ్యతిరేక ప్రభుత్వం అధికారంలోవున్న రాష్ట్రాన్ని సందర్శించడంలో రాజకీయ పరమార్థం ఏమైనా ఉన్నదా? అన్న విషయం తెలియడం లేదు. దేశ రాజకీయాలను సంక్షోభ స్థాయికి తీసుకువెళ్ళిన ఇటీవల పరిణామాల నేపథ్యంలో శ్రీ సింగ్ దక్షిణాదికి రావాలని' అందులోను ఆంధ్రప్రదేశ్‌కు రావాలని నిర్ణయించుకోవడం అందరి దృష్టిని ఆకర్షిస్తున్నది. శ్రీ సింగ్‌కు మామూలు కర్షకులతో ఆహ్వానం పంపిన రాజస్తానీ పట్టభద్రుల సంఘానికికూడా ఆయన వస్తామని చెప్పడం ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే గత సంవత్సరం అడిగితే ఆయన రాలేమని చెప్పారట.

శ్రీ సింగ్ హైదరాబాదు రావడంతో పరోక్షంగా కాంగ్రెస్‌వాదుల హస్తం వున్నదా? అన్న ప్రశ్నతోపాటు తెలుగుదేశం ప్రభుత్వం ప్రోత్సాహంకూడా ఏమైనా వున్నదా? అన్న ప్రశ్నకూడ ఉదయిస్తున్నది. శ్రీ సింగ్‌కు హైదరాబాద్‌లో ప్రభుత్వం ప్రత్యేక అతిథి మర్యాదలు ఏమైనా చేస్తుందేమో చూడవలసి వుంది. అదే సమయంలో కాంగ్రెసు పార్టీలో ఏ ఒక్కరైనా విమానాశ్రయానికి వెళ్ళడం. లేకపోతే అతిథి గృహానికి వెళ్ళి కలుసుకోవడం వంటివిచేస్తారా? అన్న విషయంకూడా చూడవలసివుంది. మాజీముఖ్యమంత్రి ఒకర్ని, మాజీ పి.సి.సి. అధ్యక్షుడు ఒకరు శ్రీ సింగ్‌కు పరోక్షంగా మద్దతు ఇస్తున్నట్లు. అదే విధంగా

—కొరవ 12వ పేజీలో

## ధృవపడని వదంతులు

- ఒక మాజీ ముఖ్యమంత్రి
- ఒక మాజీ పి సి సి అధ్యక్షుడు
- ఇద్దరు ముగ్గురు మాజీతెలంగాణా మంత్రులు

పరోక్షంగా సింగ్‌కు మద్దతుఇస్తున్నారా?

# శ్రీనివాసులురెడ్డి మీద లోకాయుక్తకు ఫిర్యాదు?

(మా హైదరాబాదు ప్రతినిధి)

రాష్ట్ర రాజకీయాలలో రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి ఇటీవల కాలంలో ఎంతగానో వివాదాస్పదంగా మారారు. ఒక్కొక్క సమయంలో ఆయన తెలుగుదేశం అధినేత శ్రీ ఎన్.టి. రామారావుకంటే కూడ వివాదాస్పదంగా మారారా అనిపిస్తున్నది. శ్రీనివాసులురెడ్డి విరుచుకుపడని వ్యక్తులు కనిపించడం లేదు. రాష్ట్ర గవర్నరుపైన విరుచుకు పడ్డారు: కేంద్ర కాంగ్రెసు నాయకులను దుయ్యబట్టారు. పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావుపై కాలుదువ్వారు. తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం.జి. రామచంద్రన్ కేంద్రానికితొత్తు అన్నారు. నెల్లూరు జిల్లాలో ఆదినుంచి శత్రుత్వం వున్న శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిని వదిలిపెట్టి అసలు తెలుగుదేశంలో ఒక

—కొరవ 12 వ పేజీలో

# జమీన్‌రైతు

## రైతులపాలిట శాపాలు!

అల్లర్లతో, అక్రమాలు, హైకోర్టు స్టేలతో నిల్చిపోయిన వాటితప్ప, తక్కిన అన్ని ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలకు ఎన్నికలు పూర్తి అయ్యాయి; ఫలితాలుకూడా ప్రకటింపబడినాయి. పార్టీ చిహ్నంతో పోటీలు జరగలేదు కాబట్టి గెలుపు ఓటములు ఎవరివి అనేది ఖచ్చితంగా తేల్చిచెప్పలేము కాని ఎంత అధికార దుర్వినియోగం చేసినా పాలకపక్షమైన తెలుగుదేశం ఆశించినంత ఘనమైన ఫలితాన్ని పొందలేకపోయింది. మండల ఎన్నికల తర్వాత, సహకార ఎన్నికలు అధికారపక్షానికి ఆఘాతం కాకపోయినా ఆశాభంగమని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

'సింగిల్ విండో' అనేది పెద్ద ప్రహసనంగానే తయారైంది; పదిహేనురూపాయల దొంగసభ్యత్వంతో సహకారసంఘాల సూత్రమే దెబ్బతినిపోయింది. ఇప్పటికే స్వాహాకారసంఘాలుగా అపవాదున్న సహకారసంఘాలు మరింత చెడ్డపేరుకు గురికావడమేకాదు; అందులో ఇప్పుడున్న సహకారంకూడా లోపించి స్వార్థం పూర్తిగా చోటుచేసుకుంటున్నది. ఇప్పటివరకు తలుపులు కిటికీలు కొంతవరకైనా తెరచిపుంచబడిన సహకార గృహాలు ఈ 'సింగిల్ విండో' తో పూర్తిగా మూతబడి వూపిరాడక చచ్చినా ఆశ్చర్యంలేదు!

'సింగిల్ విండో' విషయంలో ప్రభుత్వం ప్రకటించిన ఆశయం వుత్తమమైనదే, ఆదర్శమైనదే, ప్రజాసంక్షేమదాయకమైనదే; ప్రకటింపబడిన లక్ష్యాలు ఎంతవరకు నెరవేర్చబడుతాయనే సమస్య తర్వాతిసంగతి; ఆ సంస్థల ఆవిర్భావానికి ప్రభుత్వం అనుసరించిన మార్గం చూచినపుడు ఈ కొత్తపద్ధతిని ప్రవేశపెట్టడంలో ప్రభుత్వాధిపతులకు చిత్తశుద్ధిలేదని, అది కేవలం తమపార్టీ రాజకీయ ప్రయోజనాలకు వుద్దేశించిందని స్పష్టంగా తేలిపోయింది.

పదిహేను రూపాయలు చెల్లించిన ప్రతిఒక్కరు సొసైటీ సభ్యులయ్యారు; సొసైటీ పరిధిలో వున్నారా లేదా అనే విచక్షణ కూడా లేకుండా వందలు వేలమంది కొత్తగా ఓటర్లవలె చేర్చుకోబడ్డారు; సభ్యత్వరుసుము, ఫొటోఖర్చు, గుర్తింపు కార్డుల సేకరణ ఎవరికివారు భరించలేదు, చేసుకోలేదు; సొసైటీని స్వాధీనంచేసుకోవాలనుకున్న నాయకమ్మన్యులు మంచినీళ్ళప్రాయంగా ఖర్చుపెట్టుకున్నారు. సొసైటీల గ్రూపింగు ఒక కుంభకోణం! అది న్యాయంగా చేర్చబడ్డగ్రామాల వారందరికీ సౌకర్యంగా వుండేటట్లు జరగలేదు; తమ పార్టీ లేక తమ గ్రూపు గెలవడానికి ఏఏసొసైటీలను కలిపితే అనుకూలంగా వుంటుందో, ఆ విధంగా కలపబడ్డాయి.

పైన వివరించిన రెండిటికంటే ఇంకా అన్యాయమైందిఎన్నికలు జరిగినతీరు. డబ్బుపెట్టి ఓట్లుకొన్నారు; ఓటర్లను చేరవేయడానికి విరివిగా వాహనాలు వుపయోగించారు; అనుమానస్తులైన సభ్యులను ఓటింగులో పాల్గొనకుండాచేయడానికి, తటస్థులను గట్టిపరచుకోవడానికి, స్వంతవారిని ఖుషీచేయడానికి క్యాంపులు నిర్వహించారు; ధారాళంగా ఖర్చుపెట్టారు.

ఈ విధమైన అవినీతితో, అక్రమాలతో, అన్యాయాలతో 'సింగిల్ విండో' లను చేతబట్టుకున్న పెద్దమనుషులు సొసైటీల ద్వారా రైతాంగానికి సేవచేయగలరని ఆశించగలమా? పెట్టిన ఖర్చుకు, పడినశ్రమకు ఇబ్బడిముబ్బడిగా సొసైటీ నిధులను స్వాహాచేయకుండా నిజాయితీగా పరిపాలించగలరని అనుకోగలమా? పోటీలేకుండా, ఖర్చులేకుండా, రాజకీయాల ప్రమేయం లేకుండా ఎన్నికలు జరిగిన పాతరోజులలోనే సహకార సంఘాలు కుళ్ళుకంపుకొట్టాయి. ఇన్ని అక్రమాలతో, అన్యాయాలతో, వ్యయంతో, అధికార దుర్వినియోగంతో ఎన్నికలు జరిగిన ఈనాడు ఈ 'సింగిల్ విండోలు' రైతులపాలిటి శాపాలుకాకుండా వుంటాయా?

డిఫాల్టుకాని సొసైటీలు, సెంట్రలు బ్యాంకులు అరుదు. ఈ విధంగా డిఫాల్టు కావడానికి కారణం లేనిమనుషుల పేర్లతో కూడా లక్షలకులక్షలు అప్పులుతీసుకొని అధిపతులు భోంచేయడమే! అటువంటి దివాలాతీసిన సొసైటీలు, స్వాహాచేసిన పెద్దమనుషులు ఎన్నుకోబోయే సెంట్రల్ బ్యాంకులు ఎంతవరకు ఋణసదుపాయం కల్పించబోతాయో, సింగిల్ విండోలు ప్రజలకు ఎంతవరకు వుపయోగ పడగలవో ఆ రాముడే చెప్పాలి!

# జమీన్‌రైతు

2.7.1937

"హరాకొట్టి జమీందార్ల దొందు"
ఎకరాకు ఎనుబది-ఎనా, శ్లాబుతోను
నేకలామునుగుంతేసినారు-మమ్ము-
వికలాంగులను జేసినారు-కొంత-
లకలు గుల్లజేసినారు-
జకమాకు దిక్కెవరు?

ఈ బాధ బరలేము!

(మొదటి పేజీలో పెద్ద కార్టూన్ క్రింద ఈ గేయభాగం ప్రచురించారు. ఎకరాకు ఎనభై రూపాయల శిస్తు విధించి జమీందారు రైతులను హింసిస్తున్న సంఘటనను ప్రజల దృష్టికి తెచ్చే ప్రయత్నమిది; ఈ పేజీలో మిగిలిన భాగంలోకూడా అనాటి కాంగ్రెస్ మంత్రులపై వ్యంగ్య గేయం వుంది.)

నెల్లూరు ముచ్చట్లు

నెల్లూరు మునిసిపల్ ఎలక్షను సెప్టెంబరు, అక్టోబరులలో దూరుకుంది. పాత పందికొక్కులు అప్పుడే బొక్కలుతవ్వుతున్నాయి జిల్లాకంతా బోర్డు తలపంటిని. ఏ ఉద్యమాన్ని గూడ బల్లెంకు పాకించే శిజన్యాయ ఓడే! దీన్ని అదర్శంగా వుండాలి; కాంగ్రెసు ఈమునిసి మల్లప్పకాల్వలో రూకా ల్యా. ఉరికేనా? అదేది మీరూరాంసే! జిల్లాబోర్డులో అందరు మెంబర్లు కాంగ్రెసు టిక్కెట్టుపై జయించినవారు బోర్డుచ్చపోవడం్పు గావి. బోర్డు 46 వేల ప్రజల్లో, అందులో దరుపుకోవ, వారిలోను దివాలిది మందినో యోగ్యతలన్నిపరిశీలంచి అం గెలిచేవాడ్లను పెట్టాలనే సిద్ధాంతం కంటే, యోగ్యులున్న పెట్టి గెలిపించాలనే సిద్ధాంతం పెట్టుకుంటే మెళకువ నిస్తుకేల్తారు. యోగ్యులు వచ్చిన

### 50 ఏళ్ల క్రితం ఈవారం

మటుకే దాలు. అధికారంలో కాకుంటే అపోజిషనులో వుంటారు. భర్వాలేదు; కాబట్టి కాంగ్రెసువారు ఈవిషయాలన్ని చర్చించి యుద్దమిద్ధం తెల్పడం అవసరం.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సామాన్య సభ

నెల్లూరు మండల కాం॥ సో॥ పార్టీ సామాన్య సభ కాం॥ సో॥ పార్టీ ఆఫీసు నందు జులై నెల తే 12 ది సాయంకాలం 4 గంటలకు జరుగును.
-వి. శంకరయ్య, ప్రధాన కార్యదర్శి

వెంకటగిరి ఉదంతాలు

మహారాజాగారి ఖర్మ క్రతువులు విద్యుక్తంగా నెరవేర్చారు 11 రోజులు. ఖర్చులు 15 వేల రూపాయలకు అందవాలేవారు. పోకలు ఎన్నిటిని దబ్బాగారు తక్కిన సామర్ధ్యాలు పురుషులకు వెళ్లారు.

ఆనాడు కుమారరాజాగా వ్యవహరింపబడుతున్న శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్రులు తండ్రి నిర్యాణానంతరం వెంకటగిరి రాజాగా, జమీందారుగా వ్యవహరింపబడుతున్నారు.

లేటు మహారాజా గోపాలకృష్ణయాచేంద్రులు 37 వ ఏట తన తండ్రి మరణించెను; లేటు గోవిందకృష్ణయాచేంద్రులు 37 వ ఏట తనతండ్రి మరణించెను; అట్లే నేటి సర్వజ్ఞకుమార కృష్ణ యాచేంద్రులు 37 ఏట వీరి తండ్రికూడ మరణించిరి.

లేటు మునిరాజగోపాల కృష్ణయాచేంద్రులు 28-7-1916 న మరణించిరి. తర్వాత 7 మాసాలకు 1917 ఫిబ్రవరిలో శ్రీ గోవిందకృష్ణ యాచేంద్రులవారికి పట్టాభిషేకం జరిగింది. నేటి కొత్త రాజాగారికి ఎప్పుడు పట్టాభిషేకం జరుగుతుందో తెలియదు. పట్టాభిషేకానికి, రాజ్యాధికారానికి సంబంధంలేదు. ప్రభుత్వం మాత్రం ఈ క్రొత్త రాజాను రికగ్నైజ్ చేసినట్టు పోర్టు సెంటు జార్జి గజట్లో ప్రకటిస్తుంది. అదిమాత్రం ఇంకా జరుగలేదు;

## కొత్తనాయకులను సృష్టించండి!

వృత్తి రాజకీయాలతో సంబంధాలు లేని రాజీవ్‌గాంధి ఎన్.టి.ఆర్. గార్లు పాలకులుగా వచ్చినా, దశాబ్దాలుగా ప్రజాజీవనాన్ని కలుషితం చేస్తున్న దోపిడి శక్తులు, అభివృద్ధి నిరోధకులూ ఈ రెండు పార్టీలలో కీలక వ్యక్తులుగానే వున్నారు ఇంకా! అటువంటివాళ్ళు అనుచరులుగా, స్థానిక రాష్ట్ర నాయకులుగా వున్నంతకాలం రాజీవ్‌గాంధీలు, ఎన్.టి.ఆర్.లు దేశాన్ని, రాష్ట్రాన్ని ఏమి ఉద్ధరించగలరు?

జిల్లా విషయం చూసినా అనాదిగా ఆనం, నల్లపరెడ్డిలుకే పెత్తనం చెలాయిస్తున్నారు. బెజవాడ రామచంద్రారెడ్డి, దొడ్ల జనార్ధనరెడ్డి ప్రభావం కొద్దికాలానికే రూపుమాసి




పోయింది. కొత్త వ్యక్తులుగాని, కొత్త శక్తులుగాని మన జిల్లా రాజకీయాలపై ఇంతవరకు ఎటువంటి ప్రభావం చూపలేకపోయాయి. ఎవరో కొందరు మధ్య మధ్యలో చేసిన ప్రయత్నాలూ విఫలమైనాయి. అయితే ఓటు సమయంలో విజ్ఞతతో వ్యవహరించడంలో మాత్రం నెల్లూరు ప్రజలు పేరపొందారు.

ప్రగతిశీల పార్టీల కృషి, సాహిత్య సంస్థలు, సాంస్కృతిక ఉద్యమాలు తక్కువుల ప్రభావం సామాజిక జీవనంలో పెద్దగాలేని దశలో ప్రజలు తమ అసమ్మతాలమంతే పాలాల నేరుతుని, అవగాహన తెచ్చుకుని, రాజకీయ నిర్ణయాలు తీసుకోవడం అభినందనీయమే!

ప్రజలు విజ్ఞతతో ఇదివరకే తెర

—కొరవ 7వ పేజీలో

# శ్రీనివాసులురెడ్డి

(మొదటి పేజీ తరువాయి)

ప్రజలకి నాయకత్వం వహిస్తున్న ఆయన కుటుంబంపై వచ్చిన ఆరోపణలతో ఆగ కుండా [illegible] తనకు పోటీ దారు అయిన [illegible] [illegible] ఆయన [illegible] లేదు [illegible] మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామా రావు, తెలుగుదేశం శిరోమణి శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు మాత్రమే మిగిలి కనిపిస్తున్నారు. వారికి కూడ ఆ మర్యాద ఎంతకాలం మిగులుతుందో తెలియదు కాని శ్రీనివాసులురెడ్డి దోరణి కాంగ్రెసు నాయకులకు అసలు అంతుచిక్కడంలేదు. శ్రీ రామారావు, శ్రీ చంద్రబాబు పట్ల విధేయతతో వుంటే చాలనన్న ఆయన వికలంత వైఖరితో పార్టీలోని ఆయన ప్రత్యర్థులకు కాని, ప్రతిపక్షానికి చెందిన కాంగ్రెసు ప్రత్యర్థులకుకాని ఏమిచేయాలో తెలియని పరిస్థితి ఏర్పడింది. శ్రీనివాసులురెడ్డి గత కొన్ని నెలలుగా ఇట్లా ఎందుకు చెలరేగుతున్నారో వారికి అర్థం కావడంలేదు. శ్రీనివాసులురెడ్డి ఇలా ప్రవర్తించడానికి బలమైన కారణం ఏదో వుండి వుంటాదన్న పట్టుదలతో కాంగ్రెసు నాయకులు కారణాలకోసం అన్వేషిస్తున్నారు. శ్రీనివాసులురెడ్డి నెల్లూరులో లక్షలాది రూపాయలుపోసి బ్రహ్మాండమైన భవంతి నిర్మిస్తున్నారని, ఆయనంతా రెవిన్యూమంత్రిగా వుండి సంపాదించిందేనని కాంగ్రెసు నాయకులు ఆరోపిస్తున్నారు. ఏమీ అవకాశంలేని రెవిన్యూ శాఖలోకూడ ఇంత పొమ్ము [illegible] తమకు తెలీదంటున్నారని వీరు విస్తుపోతున్నారు. నెల్లూరు భవననిర్మాణంతో సహా ఆయన జీవితం సంపాదించిన ఆస్తులపై లోకాయుక్తకు కొందరు ఫిర్యాదులు చేసినట్లు, వాటిపై ప్రస్తుతం విచారణ జరుగుతున్నట్లు కాంగ్రెసు నాయకులు చెబుతున్నారు. శ్రీనివాసులురెడ్డి ఇంత వీరోచితంగా శ్రీ రామారావు వ్యతిరేకులపై విరుచుకుపడటానికి అసలు కారణం ఇదేనని, లోకాయుక్త నివేదిక వ్యతిరేకంగా వచ్చినా తన విధేయత రక్షిస్తుందని ఆయన భావిస్తున్నారని కూడ వారు అంటున్నారు. ఇది వాస్తవమేఅయితే తెలుగు లోకానికి ఎంతో సమయం పట్టక పోవచ్చు! రవాణామంత్రి శ్రీ కుందూరు జానారెడ్డి విషయంలో లోకాయుక్త ప్రకటించిన నివేదిక చినిగితాగ్యాలేం!

## వి. పి. సింగ్

(మొదటిపేజీ తరువాయి)

తెలంగాణాకు చెందిన ఇద్దరు, ముగ్గురు మాజీ మంత్రులుకూడా శ్రీ సింగ్‌కు తెర వెనుక వుండి సహాయ సహకారాలు అందిస్తున్నట్లు కాంగ్రెసు నాయకులు కొందరు అనుమానిస్తున్నారు. కాని వీటికి దాఖలాలుకాని, వారు శ్రీ సింగ్ పర్యటనతో సంబంధాలు పెట్టుకున్నట్లుకాని ఇంత వరకు కనిపించడంలేదు. అది కాకుండా హైదరాబాదులో ఆయన వుండే ఒక్క రోజులో కాంగ్రెసు కార్యకర్తల సమావేశం ఏదీ ఇంత వరకు ఏర్పాటుకూడా కాలేదు. అందువల్ల మొత్తంమీద కాంగ్రెసు పార్టీ దూరంగావుండి శ్రీ సింగ్ పర్యటనను ప్రేక్షకుని రీతిలో జాగ్రత్తగా గమనిస్తూ వుండిపోవచ్చు. ఇక శ్రీ సింగ్ వ్యతిరేక ప్రదర్శనలు జరప డానికి మాత్రం కాంగ్రెసు యువజన, విద్యార్థి విభాగాలు సన్నాహాలు చేస్తున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వం ఈ విషయంలో ఎలా వ్యవహరిస్తుందో చూడ వలసివుంది. పి. సి. సి. అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు నాయకత్వాన్ని

## పాలబుగ్గల ఎన్టీఆర్!

శ్రీమతి కమలాదాస్ కేరళకు చెందిన ప్రఖ్యాత రచయిత్రి మన ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు గారిని గురించి ఆమె అభిప్రాయం అడిగితే ఇట్లా చెప్పిందట.

"ఒకసారి ఎన్టీ ఆర్‌ను కలి శాను. ఆతీవల మద్రాసు విమానా శ్రయంలో కాషాయ వస్త్రాలతో కూర్చొని వుండగా చూశాను. ఆయన్ని ఎవరూ పట్టించుకోకడం లేదు నాకు జాలేసింది. దగ్గరకెళ్ళి 'నమస్తే' అని చేతులుజోడించాను. చాలా సంతోషించినట్లు కనిపించారు నేనెవరో తెలియక పోయినా గొప్పనాటక ఫక్కీ లో తలతోపాటు నడుముకూడా వంచి గంభీరంగా నాకు ప్రతినమస్కారం చేశారు. నాకు ఆయనలో గొప్ప ఆకర్షణగా కనిపించినవి ఆయన బుగ్గలు; ఈ వయస్సులో కూడా ఆయన బుగ్గలు అంత నునుపుగా ఎట్లా వున్నాయో!"



## •• పుణ్యాహవాచనం

జననం : 23.9.64 మరణం : 24.6.87

నా తృతీయ కుమారుడు

మోపూరు కోటారెడ్డి

24-6-87 తేది బుధవారం
ఉ॥ 12-20 గం.కు స్వర్గస్తుడైనాడు.
4-7-87 తేది శనివారం పుణ్యాహవాచనం
నెల్లూరు వెంకట్రామపురంలో
మా స్వగృహమునందు జరుగును.

- మోపూరు సుందరరామిరెడ్డి

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore-524001